REGD. No. MNL 18 · ESTD: 1930 · 14-9-1990 · శుక్రవారం · రు. 1.50 ఉ

# జమీన్‌రైతు



సంపుటి: 61 సంచిక 37 · స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు · మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి · సంపాదకుడు: నెల్లూరు డోలేంద్రప్రసాద్

# శీనయ్య తొలగింపుకు చెన్నా ప్రయత్నం

మంత్రివర్గ విస్తరణ రెండవ అధ్యాయ ప్రారంభానికి చెన్నారెడ్డి ఢిల్లీయాత్ర ద్వారా నాంది ప్రస్తావన జరిగింది. అమెరికానుంచి తిరిగిరాగానే తలపెట్టిన మంత్రివర్గంమార్పులు - అధిష్ఠానవర్గం నాన్చుడు వైఖరివల్ల దాదాపు రెండునెలలు వాయిదా పడ్డాయి. వివిధవర్గాలనుంచివచ్చే ఒత్తిడులు తట్టుకోలేక, అధిష్ఠానవర్గం పెద్ద తీరకాను లను సమర్థించుకోలేక గత వారంలో ముఖ్యమంత్రి మంత్రివర్గ విస్తరణ జరిపేరు. అయితే అది పరిపూర్తిగా, సంతృప్తికరంగా జరిపిన విస్తరణకాదు అనుమతి సాధించడంకోసం పెక్కువిన యాంలో రాజీపడి చేసిన మార్పులు మాత్రమే

అందువల్లే ఆయన నిన్న రెండవ విడతకు ప్రయత్నమారంభించారు. ఈ ద్వితీయాధ్యాయంలో ప్రథమ శ్రేయం- నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి ఉద్వాసన ప్రాతినిధ్యం లేని 7 జిల్లాలకు అవకాశం కల్పించడం; క్యాబినెట్‌లో హరిజన, గిరిజన, వెనుకబడినతరగతులవారికి సముచిత స్థానంచూపడం, తాను కోరిన మరో ఇద్దరు ముగ్గురు ఎమ్మెల్యేలకు మంత్రిత్వపు ప్రమోషన్ కట్టబెట్టడం ఈ విస్తరణలో ముఖ్యాంశాలుగా నిర్ణయించుకున్నారు చెన్నారెడ్డి.

తొలగిస్తే అలేపనిగా అరిచి, అగలజేసి న్యూసెన్స్ సృష్టిస్తారని హితైషులు చెప్పిన సలహాను పాటించి చెన్నారెడ్డి మొదటి విస్తరణలో శ్రీనివాసులురెడ్డి జోలికిపోలేదు. పదవులను కాదుకానే పోర్ట్‌ఫోలియో ఇవ్వడంద్వారా మాత్రమే కసి సాధించుకున్నారు. అయితే శ్రీనివాసులురెడ్డి

## ఢిల్లీ నేతలు అనుమతి ఇస్తారా?

నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డిని నిజానికి జి. వి. సుధాకరరావు, సంగీతం వెంకటరెడ్డిలతోపాటుగా ఇంటికి పంపవలసింది; కాని- అప్పుడు కొంచెం తటపటాయించారు. ఆయన తొలగింపుకు అధిష్ఠానవర్గం అనుమతి కష్టసాధ్యంగా కన్పించడంతో పాటు చెప్పిందాలా నోరున్న శీనయ్యను దానితోడు నోరు మూయకుండా, పత్రికలలో తనకు అన్యాయం జరిగిందని ఆగంచేయడంతో ఇక ఎంత మాత్రం ఆయన్ను మంత్రివర్గంలో వుంచడానికి వీలులేదనే నిర్ణయానికి ముఖ్యమంత్రి వచ్చినట్లు తెలుస్తున్నది. తన ఢిల్లీ పర్యటనలో ఆయన రాజీవ్ గాంధీకి పరిస్థితులు వివరించి, శ్రీనివాసులురెడ్డి తొలగింపుకు అనుమతి కోరుతారని చెప్తున్నారు. పనిలో పనిగా ఇద్దరు ముగ్గురు కొత్త మంత్రులకు కూడా మంత్రివర్గంలో స్థానంకల్పించే ప్రతిపాదన వుంది.

కార్పొరేషన్ ఛైర్మన్ నియామకాల విషయంకూడా చెన్నారెడ్డి ఢిల్లీలో చర్చించవచ్చు. దాదాపు వంద కార్పొరేషన్ పదవులు తొమ్మిది నెలలనుంచి ఖాళీగా వున్నాయి. అందులో ఎపిఐఐసి, ఎస్ ఎఫ్ సి, ఆర్ టి సి, ఎస్ టి సి వంటివి మంత్రిత్వంతో సమానమైన హోదా కలిగినవి. మంత్రిత్వాలు పొందలేక ఆరాటపడుతున్న ఎమ్మెల్యేలను వీటి ద్వారా సంతృప్తి పరిచేందుకు చెన్నారెడ్డి ప్రయత్నించబోతారు.

ఏ విషయమైనా ఢిల్లీలో ఆయనకు ఎదురయ్యే ఆదరణ, అధిష్ఠానవర్గం సుముఖతను బట్టి నిర్ణయమౌతుంది. ఈ పర్యటనతోనే ఆయన తాననుకున్న మార్పులకు అనుమతి సాధిస్తారో లేక మరికొంత కాలం వేచిచూడవలసిన పరిస్థితి ఏర్పడుతుందో తెలియదు.

* * *

రాజకీయం కంటే నక్సలైట్ల సమస్య చెన్నారెడ్డికి కొరకరాని కొయ్యగా తయారైంది. ప్రభుత్వాన్ని, పోలీసు పెత్తనాన్ని సవాల్‌చేస్తూ నక్సలైట్లు తమ పని తాము చేసుకుపోతున్నారు. హైదరాబాద్‌లో జరిగిన రైతుకూలీ సదస్సు ఇందుకొక నిదర్శనం. సదస్సుకు ఆటంకాలు కల్పించడానికి పోలీసులు చేసిన ప్రయత్నా

—[illegible] పేజీలో



# శ్రీ రాజరాజేశ్వరి అమ్మవారి దేవస్థానం

దర్గామిట్ట :: నెల్లూరు-4 ఫోన్ : 2016

# నవరాత్రి బ్రహ్మోత్సవ ఆహ్వానము

## 19-9-90 నుండి 29-9-90 తేది వరకు

శ్లో॥ అంబా శాశ్వత ఆగమాది వినుతా ఆర్యా మహాదేవతా॥ యా బ్రహ్మాది పిపీలికాంత జననీ యావై జగన్మోహినీ॥
యా పంచ ప్రణవాది రేఫజననీ యాచిత్కళామాలినీ॥ ఛిద్రూపి పరదేవతా భగవతీ శ్రీ రాజరాజేశ్వరీ॥

ఆర్యా! స్వస్తి! నెల్లూరు దర్గామిట్టలోని శ్రీ రాజరాజేశ్వరి అమ్మవారి దేవస్థానమునందు నవరాత్రి బ్రహ్మోత్సవములు శ్రీ ప్రమోదనామ సం॥ ఆశ్వయుజ శుద్ధ ప్రతిపత్ 19-9-90 తేది బుధవారము మొదలు 29-9-90 తేది శనివారము వరకు జరుగును. ప్రతిదినము ఉదయం 8 గంటల నుండి 12 గంటల వరకు విశేషసావరణ అష్టోత్తర, సహస్రనామ పూజలు జరుగును. కావున భక్తులు, ఉభయకర్తలెల్లరు పాల్గొని కార్యక్రమములు జయప్రదముచేసి శ్రీ రాజరాజేశ్వరి అమ్మవారి కరుణాకటాక్షములకు పాత్రులంగుదురని ప్రార్థించుచున్నాము.

### ఉత్సవ కార్యక్రమములు

| తేది | వారము | తిథి | అలంకారము | ఉభయకర్తలు |
|---|---|---|---|---|
| 19.9.90 | బుధవారము | పాడ్యమి | ఉ॥ 8 గం॥కు తులాలగ్నమందు కలశస్థాపన, చండీ అలంకారము | శ్రీ ఆర్. వెంకటేశ్వరరావు, పోస్టల్ కాలనీ, నెల్లూరు-4. |
| 20.9.90 | గురువారము | విదియ | భవానీ అలంకారము | శ్రీ మాగుంట సుబ్బరామిరెడ్డి, సుధాకరరెడ్డి, శ్రీనివాసులరెడ్డి, నెల్లూరు. |
| 21.9.90 | శుక్ర | విదియ | లలిత అలంకారము | శ్రీ సన్నపురెడ్డి పెంచలరెడ్డి, పోస్టల్ కాలనీ, నెల్లూరు-4. |
| 22.9.90 | శని | తదియ | గాయత్రి అలంకారము | శ్రీ అనపల్లి అశోక్‌కుమార్‌రెడ్డి, కోవూరు. |
| 23.9.90 | ఆది | చతుర్థి | అన్నపూర్ణ అలంకారము | శ్రీమతి దేవిరెడ్డి శైలజమ్మ, మద్రాసు. |
| 24.9.90 | సోమ | పంచమి | గజలక్ష్మి అలంకారము | శ్రీ పి. ఓబులరెడ్డి, మేనేజింగ్ డైరెక్టరు ఇంటర్‌నేషనల్ లిమిటెడ్, నిప్పో, నెల్లూరు. |
| 25.9.90 | మంగళ | షష్ఠి | కాళికాదేవి అలంకారము | శ్రీ రెన్నారెడ్డి సతీష్‌కుమార్ రెడ్డి, ఇండికేర్ మెడికల్స్, నెల్లూరు. |
| 26.9.90 | బుధ | సప్తమి | సరస్వతి అలంకారము | శ్రీ బి. మధుసూదనరెడ్డి, వారి శ్రీమతి శశి అమెరికా వాస్తవ్యులు. |
| 27.9.90 | గురు | అష్టమి | దుర్గా అలంకారము | శ్రీ ఆర్. వెంకట్రామయ్యనాయుడు, మిలటరి కాలనీ, నెల్లూరు-4. |
| 28.9.90 | శుక్ర | నవమి | మహిషాసురమర్దని, సుహాసినిపూజ, | శ్రీమతి ఆనం అమ్మణమ్మ, ప్రొ॥ సుందర్‌శిల్క్స్, నెల్లూరు. |
| 29.9.90 | శని | దశమి | శ్రీ రాజరాజేశ్వరి అలంకారము, శమీపూజ, పారువేట, గ్రామోత్సవము | శ్రీ జక్కా కోదండరామిరెడ్డి, M. L. A , నెల్లూరు |

### ప్రత్యేక కార్యక్రమములు

| తేది వారము | సమయం | కార్యక్రమము | ఆర్థిక సహాయము అందజేసినవారు |
|---|---|---|---|
| 19.9.90 బుధవారం | రాత్రి 7 గం॥ నుండి | హరికథా చక్రవర్తి, హరికథా సామ్రాజ్యసార్వభౌమ బ్రహ్మశ్రీ కోట సచ్చిదానంద శాస్త్రిగారు, టి. వి., రేడియో విద్వాంసులు గుంటూరువారిచే 'నర్తనశాల'. | శ్రీ ఆర్. వెంకటేశ్వరరావు, పోస్టల్‌కాలనీ, నెల్లూరు. |
| 20.9.90 గురువారం | రాత్రి 7 గం॥ నుండి | ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన, మద్రాసు కూచిపూడి ఆర్ట్స్ అకాడమీ డైరెక్టరు డా॥ వెంపటి చినసత్యంగారిచే 'శ్రీకృష్ణ పారిజాతము' నృత్యనాటిక. మరియు నృత్యములు. | శ్రీయుతులు మాగుంట సుబ్బరామిరెడ్డి, సుధాకరరెడ్డి, శ్రీనివాసులరెడ్డి, నెల్లూరు. |
| 21.9.90 శుక్రవారం | రాత్రి 7 గం॥ నుండి | భారతదేశంలో ఠక్కని హాస్యరసంలో స్వతి మెత్తని రాజకీయ విమర్శకుడు పద్మశ్రీ నాజర్ దళం గుంటూరు వారిచే 'బుర్రకథ'. | శ్రీ సన్నపురెడ్డి పెంచలరెడ్డి, పోస్టల్ కాలనీ, నెల్లూరు. |
| 22.9.90 శనివారం | రాత్రి 7 గం॥ నుండి రాత్రి 9 గం॥ వరకు | కుమారి హరిప్రియ, కుమారి షణ్ముగప్రియ, మద్రాసు వారిచే 'సంగీత కచ్చేరి'. | |
| | రాత్రి 9 గం॥ నుండి | శ్రీ నేతాజీ నాట్యమండలి(రిజిష్టర్డు) నెల్లూరు వారిచే 'మాయాబజారు'. | శ్రీ అనపల్లి అశోక్‌కుమార్‌రెడ్డి, కోవూరు |
| 23.9.90 ఆదివారం | రాత్రి 7 గం॥ నుండి | అంతర్జాతీయ నృత్యమణి, శ్రీమతి రాధ, మద్రాసు బృందంచే త్యాగరాజస్వామివారి 'నౌకాచరిత్ర' నృత్యనాటిక (కృష్ణ-గోపికల నౌకావిహారం) | దేవస్థానము. |
| 24.9.90 సోమవారం | రాత్రి 7 గం॥ నుండి | మృదు మధుర, సినీగాయకులు శ్రీ పి. రామకృష్ణ మద్రాసుగారిచే 'మ్యూజికల్ నైటు | శ్రీ పి. ఓబుల్‌రెడ్డి, మేనేజింగ్ డైరెక్టర్, ఇంటర్‌నేషనల్ లి. 'నిప్పో', నెల్లూరు. |
| 25.9.90 మంగళవారం | రాత్రి 7 గం॥ నుండి | వాయులీన చక్రవర్తులు పద్మశ్రీ NTR విశ్వామిత్ర సినిమాలో రామ-లక్ష్మణులుగా నటించిన అపూర్వ సోదరులు "గణేశ్-కుమరేష్", వయొలిన్ యుగళం మద్రాసు | శ్రీ రెన్నారెడ్డి సతీష్‌కుమార్‌రెడ్డి, ఇండికేర్ మెడికల్స్, నెల్లూరు. |
| 26.9.90 బుధవారం | రాత్రి 7 గం॥ నుండి | నాదస్వరబ్రహ్మ, మంగళవాద్య విశారద నాదస్వర ఆచార్య పద్మశ్రీ 'షేక్ చినమౌలా' షేక్ గారిచే శ్రీరంగం (Trichy) నాదస్వరం. | దేవస్థానము |
| 27.9.90 గురువారం | రాత్రి 8 గం॥ నుండి | శ్రీరామ్‌ప్రసాద్ కళానిలయం (రిజిష్టర్డు) నెల్లూరువారిచే 'శ్రీకృష్ణ సత్య' అను పౌరాణిక నాటకం. | శ్రీ ఆర్. వెంకట్రామయ్యనాయుడు మిలిటరికాలనీ, నెల్లూరు. |
| 28.9.90 శుక్రవారం | రాత్రి 7 గం॥ నుండి | అంతర్జాతీయ కూచిపూడినృత్య కళాకారులు శ్రీ వెంకట్రామ నాట్యమండలి కూచిపూడి సంస్థాపకులు పద్మశ్రీ డా॥ వేదాంతం సత్యనారాయణశర్మగారిచే 'విప్రనారాయణ' నృత్యనాటిక. | శ్రీ ఆనం గోపాలకృష్ణారెడ్డి హైదరాబాదు. |
| 29.9.90 శనివారం | రాత్రి 7 గం॥ నుండి | కుమారి సుచిత్ర (పిసినటి ప్రేమకావ్యం) కుమారి భవాని మరియు మాస్టర్ సుధీర్‌లచే కూచిపూడి జానపద నృత్య ప్రదర్శన. | శ్రీ జక్కా కోదండరామిరెడ్డి MLA నెల్లూరు. |

**1-10-90 తేది సోమవారం మధ్యాహ్నం 12-00 గంటలకు దేవస్థానం వారిచే "అన్నదానం"**

విద్యుత్ దీపాలంకరణ : శ్రీ వాసిరెడ్డి వెంకటేశ్వరరావు అండ్ పార్టీ, కాపువీధి, నెల్లూరు   పుష్పాలంకరణ : శ్రీ కె. పెంచలయ్య శ్రీ రాజరాజేశ్వరి ఫ్లవర్ స్టాల్, దర్గామిట్ట, నెల్లూరు
మంగళ వాయిద్య : శ్రీ కె. రమణయ్య అండ్ పార్టీ, ముత్తరాజావారివీధి, నెల్లూరు   అలంకార సమర్పణ : శ్రీ యం. కృష్ణమూర్తాచార్యులు అండ్ సన్స్, దర్గామిట్ట, నెల్లూరు.

— భవదీయులు —

కోడూరు వెంకటరాఘవరెడ్డి, ఛైర్మన్   పసుపులేటి మాధవయ్య, బాలారఫ్ నరేంద్రప్రసాద్, శ్రీమతి ఉగ్గుమూడి వసుంధరమ్మ
శ్రీమతి ఏటుకూరు భాగ్యలక్ష్మి, ట్రస్ట్‌బోర్డు సభ్యులు

విజ్ఞప్తి : దేవాలయమునకు విరాళము భక్తులు క్రమశిక్షణతో నడుచుకొనవలయును. కానుకలు చెల్లించువారు ఆఫీసులో చెల్లించి అద్భుత రశీదు పొందవలయును

గమనిక : దేవస్థానము వారిచే గ్రామోత్సవమునందు శ్రీ సాంబశివరావు అండ్ పార్టీ, తెనాలి వారిచే ప్రత్యేక బాణాలు నిర్వహించబడును.

Edited, Printed & Published by N. Dolendra Prasad at the Zamin Ryot Press, - Nellore